శ్రీ

# భక్తమోహనం.

ఇయ్యది

అ. బా. మిషను. బాలికాబోధనాభ్యసన పాఠశాలా
చిత్రలేఖన సంగీతోపాధ్యాయుఁడును
క్రీస్తువిజయధ్వజ, సత్యవర్తి విజయాద్యనేక
గ్రంథకర్తయు నగు

వై. జాను ఎలీషా

విరచితము.



ఒంగోలు

1933.

Price 0-4-0 వెల 0_4_0

శ్రీ

# భక్త యోహాను.



ఇయ్యది

అ. బా. మిషన్. బాలికాబోధనాభ్యసన పాఠశాలా

చిత్రలేఖన సంగీతోపాధ్యాయుఁడును

క్రీస్తువిజయధ్వజ, సత్యవర్తి విజయాద్యనేక

గ్రంథకర్తయు నగు

## వై. జాన్ ఎలీషా

విరచితము.



ఒంగోలు

1933.

Price 0—4—0.  రు 0—4—0

# FOREWORD.



**By Miss. H. L. Bailey, M. A , Manager,**
A. B. M. Training School for Mistresses, Ongole.

It gives me pleasure to recommend this drama on the life of John the Baptist written by Mr. Y. John Elisha. Both the composition and the dramatic element in the story have received special care. The reproduction of the drama if given in the right spirit is very impressive Such dramas as these help to fill the need in Telugu literature for good reading and drama from the Christian standpoint I can only wish for this book a wide circulation among our Christians.

Ongole,
7—4—1933.

**Helen L. Bailey.**

# తొలిపలుకు.

సోదరులారా!

మన యాంధ్రదేశమునందలి క్రైస్తవులు పండుగ సమయములందు హిందూనాటక ప్రదర్శనము వీక్షించిన మనవారును నా మిత్రులగు కొందఱు నయ్యది సమంజసము కాదని భావించి యొకానొక సమయమున బ్రస్తావనావశంబున దమ యభిప్రాయము నాకుం దెలిపి దైవగ్రంథమునందలి కథలను నాటకరూపమున వ్రాసి ప్రదర్శించిన పామర ప్రపంచమునకుఁ జాల నుపయుక్తముగా నుండునని నన్ను బ్రోత్సహించుటచే నే నీ యుద్యమంబునకుఁ గడంగితి.

ఇందలి గుణదోషంబులు నిర్ణయించి నాకుం దెలుపుటకు విజ్ఞులగు పెద్దలఁ బ్రార్థించుచున్నాఁడ.

ఒంగోలు,
6-4-1933.

ఇట్లు విన్నవించునది
వై. జాన్ ఎలీషా.

# నాటకమునందు వచ్చు పాత్రలు.

| | | |
|---|---|---|
| 1. | యోహాను | బాప్తిస్మమిచ్చు క్రై[illegible] |
| 2. | హేరోదు | రాజు. |
| 3. | హేరోదియ | ఫిలిఫ్ భార్య. |
| 4. | సలోమి | హేరోదియ కుమార్తె. |
| 5. | హాజర్య | మంత్రులు. |
| 6. | సెఫన్య | |
| 7. | మెహీదా | పౌరులు. |
| 8. | హార్ష | |
| 9. | బర్కోసు | |
| 10. | తెమహు | |
| 11. | బజ్లీతు | |
| 12. | నలుగురు కిరాతులు | అడవిజనులు. |
| 13. | విదూషకుఁడు | రాజుయొక్క మిత్రుఁడు. |
| 14. | భటుఁడు | సేవకుఁడు. |
| 15. | ఇరువురు సుంకరులు | పన్ను వసూలు జేయువారు. |
| 16. | ఇరువురు రాణువవారు | యుద్ధభటులు. |
| 17. | పచనకర్త | వంటవాడు. |
| 18. | వెట్టి | చాటింపు సేయువాడు. |

# భక్తమోహనం.

## ప్రథమాంకము.

(ప్రథమరంగము.)

మ॥ కనిశుద్ధాత్ముఁడు భక్తపాలకుఁడు సర్వద్రష్టయుఁ గర్తయుఁ
గరుణాళుండునుస్వయంప్రకాశుఁడు లసద్గర్వాంధభానుండు దు
ష్కరపాపాటవిదావపావకుఁడు సామ్రాజ్యాధిపత్యప్రము
ఖ షడ్వర్గవినాశకుండగు మహేశా మీకివే మానతుల్॥

సభాభవనము.

(హేరోదు మంత్రులుఁ బ్రవేశింతురు.)

హేరోదు—(మంత్రింగని) సచిపుంగవా! హాజర్య!! మన సామ్రాజ్యమునందలి ప్రజలు ధర్మానువర్తులై న్యాయపథంబున వర్తించుచుండినటుల మీరుఁ దెలిసికొనుచుంటిరా?

క॥ నాదగుననుజ్ఞలు నాశీ
ర్వాదనినాదము జనాళి భావంబున నా
హ్లాదంబుఁ గలుగనీక వి
షాదముఁగూర్చునని వల్కు స్వాములుఁగలరే?

వ. నాయాజ్ఞానుసరణంబున బ్రజలు సవినయచిత్తులై వర్తించుచున్నవారలా?

హాజన్యా—దేవరా! జనులు దమ తమ నిజకులోచిత ధర్మ నియామక కార్యముల సక్రమముగా నిర్వహించుచు దేవరవారి గాంభీర్య పరాక్రమం బవలోకించుచు శాస నంబుల కొదిగి జరించుచున్నవారలు.

హేరోదు—సంతసించితి. సంచరించితి.

సెఫన్యా—భూవరేణ్య! ప్రజలెల్లఱు భవదీయ ప్రపాలనాశక్తి లంగని సంసించుచున్నవారలు, గాని తమ సోదరు డగు ఫిలిప్పను మహనీయుడు వినోదభావంబున గుత్సితహంతకజనంబులం జేర్చి మీరు పరనారీలోలు రనియు యుక్తాయుక్త పరిజ్ఞానశూన్యులనియుఁ జెప్పగ వింటి.

హేరోదు—ఓయీ! సెఫన్యా! లోకులు పలుగాకులు. లోకంబు మాయ మూకుడు గలదే! ఏమందువా?

సీ। రాజవశంబుల రక్షించువాడని
యుర్వినందున గీర్తి నొందినాఁడ
సర్వసౌఖ్యంబుల సతతంబుఁగని భూమి
నేక ఛత్రంబుగా నేలినాఁడ
తలఁచినంతనె విశ్వ ధాత్రీ జనులకెల్ల
భయదుఁడీతఁడటంచుఁ బ్రబలినాఁడ
సుజన దుర్జనులను శోధించి నియమించు
వాఁడె యోఘనుఁడన వరలినాఁడ

గీ॥ నిట్టినన్యాడు దుర్జన ♦ హీన వాక్య
ములకు నులుకంగసాంనె పో ♦ ముద్గాతమ్ము
సతినిగు డీన వాఁడని ♦ చౌకసేఁయు
వానికి బ్రతుకుఁగలదె? భూ ♦ వలయమందు.

వ. సెఫన్యా! మదీయసోదరుండగు ఫిలిఫ్ సతీమణి రూపు లావణ్యాదులఁ దిలకించి నాకొప్పుటచే స్వీకరింప నుద్దేశించితి నియ్యది పాతకంబనఁదగదు. ఏలనన పుడమి ఱేఁడులకు బహుదారగ్రహణ మత్యాదరణీయంబని యెఱుఁగవో?

హాజర్య—రాజేంద్రా! మీనుడులు తథ్యంబులు. రాచకీయ వ్యవహారధురంధరులకు నిట్టి పరదారగ్రహణం బతి ప్రియంబని నాకుం దోఁచుచున్నది.

గీ॥ లసాలోమోను పరస్త్రీలఁ ♦ గలియలేదె?
బలుఁడౌ సంసోను వేశ్యలఁ బట్టలేదె?
కాన మీకును బరదార గవయఁదప్పు
లేదటంచుఁ దెలిసెను హే ♦ దురాజ!

హెరోదు—సెభాస్. హాజర్యా! నీతోడ్పాటుకు మెచ్చితి. సెఫన్యా! భవదీయోద్దేశ మేమి?

సెఫన్య—రాజా! నాయభిప్రాయ మేమున్నది?

గీ॥ చెడుగు నొనరింపయత్నించు ♦ శ్రీమతులకు
ధరణి నిసుమంతయును బాధఁ ♦ దగులఁబోదు.

వేదలోనరించు సుకృతముల్ ♦ బేరుఁగొనక
సార్థకము లేకపోవును ♦ సార్వభౌమ!

వ. కావున తామొనరింపఁదలఁచు కార్యమున కెన్నికలు గలుఁగవని నా దృఢనిశ్చయము.

హేరోదు—మెచ్చితి. మంత్రులన్న నిట్లుగదా ప్రభు మనోగతమున కనువగు సలహాల నిచ్చుచుండవలయు ? కాలయాపనమేల ?

ఉ॥ సోదరుఁడౌ ఫిలిప్పుసతి ♦ సొంపుగఁ బూలవనంబునందు స
మ్మోదముతో మెలంగి మన♦ముజ్జ్వలపుష్పములన్ గనుంగొనన్ జూచినా
మోదమునన్ జడన్ ముడిచి ♦ మోహమునన్ దెరుబాసి గంధ
మాఘ్రాణిసువాసనల్ మెరసె ♦ కన్నయుఁ జక్కెఁ గాలవిస్మయే.

రా : మోహన తా . ఏకతిశ్ర.

మనోనిశ్చలంబునొంద—నుగువఁజూడఁ బోయెదన్ -
వినిత రూపముగని వసుధమాలింతును ॥మనో॥

వ. ఇఁక భవనంబున కరుగుదమురండు.

(నిష్క్రమింతురు.)

# ప్ర థ మాం క ము.

## (ద్వి తీ య రం గ ము)

(పు ష్ప వ న ము)

(హేరోదియ ప్రవేశము)

రా : మోహన తా : త్రిపుటతిశ్ర.

కనులాశఁదీరఁగఁ గాంక్ష పుష్పము—ల్గాంచిగోసియు జడను
గుచ్చెద నిత్తరిన్—కరవీరమందరమల్లి కల్లవె గోతును.

వ. ఆహా! చల్లని మందమారుతి చలనకలిగ మేనెల్ల సంభ్రమము నొసంగుచున్నది. (చూచి) ఇదే! యీరసాలతరువు నలముకొనిన లతామంజరులఁ గోసి పూలసెజ్జ నిర్మింపఁ నొంకుచుఁగాక. (పరిక్రమించి) ఓహో! యీ పులుగుల వింతరవములు, శ్రోత్రపేయములుగ నున్నవి.

సీ. శుకపికారావములు సొంపుగా నేరేడు
తరుచయంబులఁ జేరి తనరుచుండెఁ
కొలకుల రాయంచ కలకలధ్వానంబు
లాత్మసేయంబు లగుచునుండెఁ
జలధర రవముల నెలమి నాకర్ణించి
అల మయూరచయంబు లాడుచుండెఁ
సెలయేటి దరులందు మొలచు దూర్వాంకుర
భక్షణార్థము లేళ్ళు ప్రాకుచుండెఁ

గీ. మల్లియలు సన్నజాజులు మొల్లవిరులు
పారిజాత గులాబి సంపగలు బంతి
కురవకంబులు చామంతి కుసుమములును
పరిమళింపంగ నీతోట వరలుచుండె.

వ. ఇఁకనే రయంబున జని వికసితమాధవీలతాప్రసూన మంజరులఁగోసికొందుఁగాక (పూలుగోయుచుండును)

(హేరోదు విదూషకునితో ప్రవేశించును.)

హేరోదు—మిత్రమా! మనమిప్పు డిచ్చటికి వచ్చుటకుంగల కారణంబు నామనంబు విరాళిగొనుటచేత నేగదా?

కొంతకాలమీవనంబున విహరించి నా హృదయ తాపముఁ దీర్చికొనియెద.

విదూషకుఁడు;—ఔను, విరహులకు మనశ్శాంతిఁగలిగించు నది వనవిహారమేగదా?

హేరోదు;—వనవిహారముమాత్రము గాదుసుమీ?

విదూషకుఁడు;—ఇంకేమికలదు?

హేరోదు;—వినుము, తెల్పెద.

గీ॥ మల్లెపొదరిండ్ల వరుసలు ? మధుర ఫలము
లచె వరలెడు వృక్షంబులు ? లలితగతిని
బారెడు సెలయేళ్లునటవి ? కారుకోళ్ళు
గనఁగ శాంతినింపెసలార ? గలుఁగకున్నె.

విదూషకుఁడు;—అవును, నీయభిప్రాయము గ్రహించితి. మిత్రమా! అల్లదే! పుష్పమంజరులచే నలంకరింపబడిన వనకుడుంగములు చనిగని ప్రమోదమందుదమురమ్ము.

హేరోదు; — ఇదేవచ్చుచున్నాడ (పరిక్రమించి) విదూషకా! నామనోగతంబీడేరుసమయ మాసన్నంబయ్యెనని పచి యుంప సంతసించుచున్నాడ.

విదూషకుఁడు;—ఇవ్వనంబున నీమనోగతం బీడేర్పనేతెంచు పడంతుక లెవ్వరు?

హేరోదు;—(నవ్వి) అదృష్టరేఖయే నాయభిమతంబీడేర్ప నొకరాపుత్రికం గొనివచ్చును.

విదూషకుఁడు;—ఏమది ? రాపుత్రికయా ? నీవాక్యముల భావము గోప్యముగనున్నది. దాపక వ్యక్తీకరింపుము.

హేరోదు;—వయస్యా! నీకడదాపరికమేల? సౌందర్యవతియగు హేరోదియను సంగ్రహింప ననేకపన్నాగములుపన్ని తుదకు బరిచయముజేసికొంటి. విహారార్థమివ్వనంబున జొచ్చి పుష్పములగోయుచుండును. అదృష్టవశంబున గానుపించినచో స్నేహబంధమమర బ్రోత్సహించెద. నీకుసంతసమా?

విదూషకుఁడు;—సంతసముగాకేమున్నది? గాని యింతదనుక నీరహస్యము వెలిబుచ్చకుండుటచే జింతిలుచున్నాఁడ.

హేరోదు;—కార్యసాఫల్య మొందినపిదపఁ దెలుపఁదలంచితి. క్షమింపుము. (పరిక్రమించి) ఆహా! ఏమీ! పుష్పమంజరుల సొబగు?

రా : ఖమాసు "సుజనజీవన" తా : రూపకము.

రమణీయంబగు - రాజిలు పుష్పంబులం జూడుము
ప్రమదమందఁగఁ - బలురీతులఁ - బ్రసరించెను ॥ ర ॥
క్రమ మొప్పఁగ పుష్పగుత్తులు-నలముకొనియెను ॥ ఆహా ॥
కుడుంగముల చాలు నలయ - గడుసంతసమదిగనఁగ -
నొడలికనువగు వాయువు గూర్చెను - విడువజాలనీ -
విమలమంజరుల లతలు - విరిమల్లెలు రోజాబంతులు -
మరువము లవిగోసోదర ॥ రమ ॥

విదూషకుఁడు—ఔనౌను. పలువిధంబులగు పుష్పగుత్తులు గనులపండు వొనరించుచున్నవి.

హేరోదు— రమ్ము పూలు గోసికొందము. ( పరిక్రమించి హేరోదియను గనుగొని) విచిత్రమా! నీవిటనున్నావు. నామనోహరిజాడఁ బొడగాంచితి. పోయివచ్చెద.

విదూషకుఁడు —మంచిది. శీఘ్రముగ రమ్ము. (కూర్చుండును)

హేరోదు —(స్వగతము)

ఉ॥ పూలవనంబునందుఁ బడి ♦ పూర్ణశశాంకముఖిన్ గనంగ ని
క్కాలము మంచిదాయె మది ♦ గాంక్షవహించి బిరాన రాగ నీ
బాలసుమంబులఁ జిదిమి ♦ పత్రపుటంబులఁ బెట్టుచున్ ముదం
బొలిని గూర్చుచున్ మదికి ♦ నుజ్జ్వలశారదజ్యోత్స్న నైవడిన్.

(ప్రకాశముగా) హేరోదియా!! నామనోహరి' ఒంటరి పాటున నివ్వనంబున బూలు గోయుచుంటివా?

హేరోదియ—(తలవంచుకొని) చిత్తము. మీరిచ్చోటికి వచ్చుటకు గతంబెయ్యదో నేనడుగఁదగునా?

హేరోదు—ప్రేయసీ! హేరోదియా!! నీపైఁగల గాఢానురాగమే నన్నిందనుకొనివచ్చె? మారాడవేమి!

రా : కళ్యాణి                                        తా : ఆది,

చాయ॥ "ఏతావునర నిలకడ"

నీమనోజ్ఞతలన్ - నేగనివిడువకుంటి - నెమ్మి నన్నంగీ
కరింపరమ్ము ఓకాంతా!                    ॥ నీ ॥

నామనోహరి వీవని - నామానసంబున - ప్రేమతోడ
వరియించితిఁ బ్రియమొప్పంగ - నన్నంగీకరించుము    ॥ నీ ॥

హేరోదియ — పరాభవము గల్గునంచు నే - భయపడుచుంటిని భూజానీ! - నరులకు నగుబాటగునటంచు - మురిపముఁ జూపకుంటిని - దురాశ చేనగ వరించుట - ద్రోహం బంచుఁగోర్క - ధరఁదమ్ముసతిఁగొనుట - దురితంబని లోకులు నగరే? ॥ పరా ॥

వ. పురుషపుంగవా! నీతియుక్తమగు చెలిమి భూనభోమండలముల శ్లాఘ్యమొందుగాని మోహాంధతచే బెనసి యతిశయిల్లెడు పాపేచ్ఛ జలబుద్బుదమువలె గొన్నినాళ్ళకే యంతమించి దుఃఖాతురులఁ జేసి నశింపనడుపును.

హేరోదు — ఏమీ! ఎటులఎటుల? పాపేచ్ఛయా? నిన్ను సంగ్రహించి గృహస్థధర్మము మరల నవలంభింపఁ జేయదలఁచి యున్నవాఁడ. ఏమందువా?

సీ॥ అఖిల సౌఖ్యంబుల ❀ ననుభవించుటకునై
యమరుగదా యీగృ ❀ హస్థవృత్తి
అతిథులకెవ్వేళ ❀ నాతిథ్యమొసగంప
ననువౌగదా యీగృ ❀ హస్థ వృత్తి
త్రైవర్గికంబుల ❀ ధర ననుష్ఠింపంగ
నాధారమౌను గృ ❀ హస్థ వృత్తి
వంశాభివృద్ధి ని ❀ వ్వటిలఁ జేయునుగదా
యవనీతలమున గృ ❀ హస్థవృత్తి
గీ. అట్టి గార్హస్థ్య మిబ్భంగి ❀ నవలఁద్రోచి
స్థాణువలె నుండుటర్హమే ❀ సరసజాక్షి

కామదేవతను హరించి ׀ గాత్రిలునంత
యశముఁగాంతువె? నిద్ధర ׀ వ్యసనమదిఱె.

వ. ఇపుడునీకుంగలపుత్రికారత్నమునునీయౌవనదశనుస్వీక రింపఁ గలింగితివికదా? ఇంతలో కండర పటుత్వమంత రించెనా? మణినికేతనంబున గష్టమనుభవింపక నవ రుచులు మెసవు నీకెటుల పురుషవాంఛ జనింపదు ?

హేరోదియ——రాజచూడామణీ! మీావెనుక భువిఁ బ్రతిఫలిం చిన సోదరు సతీమణినిగద? నన్ను మరల దమ సతీ మణిగ స్వీకరించినచో లోకులు బరిహసింపరే?

గీ॥ ధరననిత్యమౌ తనువు స ׀ దాఘనతను
బడయనిచ్ఛగింపవలయుఁ ׀ బాపకార్య
ములొనరింపఁగ సద్భావ ׀ ము విడిమెలఁగు
చుండ లోకులునవ్వరే? ׀ సుజనహితుఁడ?

హేరోదు;——సఖీ! ఈనీతులు నేనెరుంగనివికావు. కాలవిలం బనమొనరింపక నామొక్కు-చెల్లింపుము.

రా: శంకరాభరణము తా: ఆది.

మదిగోరినవనితను జేబట్టుట-కిదియదనంచువచ్చితి
సఖియా!——విదితంబగు సోదరు సతియైనను విసువకేఁ
జేపట్టఁగవచ్చితిని॥మది॥

హేరోదియ;——బుధజనులసముఖమున గూడనిపని-భువిగావిం పఁగఁబాడియె? రాజా?——అధములుసంయుత మిదేమ టంచుబల్-ఆడికలాడ యత్నింతురురాజా!! ॥బు॥

హేహోదు:—లోకనింద్యములకు వెఱవకుము. నీమనోనిశ్చలత బదిలపరచుకొనుము, నిన్నపారసంతోషవారాశి నోల లాడింతు.

హేరోదియ:—(స్వగతము) ఏమిది! ఎన్నివిధముల నీతని వారింపఁజూచినను మగియస్నేహలతాబంధమే గోరు చుండె. లోకులు నన్నెంతగనిందింతురో? ఇతని బాసి పోవుటకు నాకును మనస్సొప్పకున్నది. ఐన మౌనము దాల్చెదగాక.

హేరోదు:—హేరోదియా! మౌనమంగీకారసూచకముగాదే? ఆహా! ధన్యోస్మి. ధన్యోస్మి. నేటికి నానోముపండె, రమ్ము. అస్మిమదీయ మణిని కేతనమునకు వెడలుదము.

(నిష్క్రమింతురు.)

# ప్ర థ మా ం క ము.

(తృతీయ రంగము)

(బాప్తిస్మమిచ్చు యోహాను ప్రవేశము)

రా: శంకరాభరణము. తా: ఏక

కృపాసాంద్రుండౌ యేసు-నపార దయానిధి
నాపుణ్యుఁడేసుని జూటఁగ వెడలెద॥కృ॥
అపచితుండౌ క్రీస్తునాధు-నవని నుతిసల్పఁగఁగాదె?-
అపూర్వవరదానము దొరకును॥కృ॥

1. పాపులిలసత్పథి నడువంగఁ - బాటువడుట సమాజస
మయ్యది = కోపావేశంబున బాపులగదిమెదఁ ॥కృపా॥

వ. ఆహా! దారుణ దండోపాయకల్మషప్రాంతదోళనావితర్కనాధిక్యతలఁజెండి భూనభోమండలముల ప్రశాంతిసారించి జనులసంరక్షించెడు భగవంతు వాగ్ధాటి నాశోత్రములకు విందొనరించి పాపజనాళికాస్పదము యేసుక్రీస్తు మహాత్ముండని జాటఁబొమ్మని బోత్సహించు టెంతయు శ్లాఘ్యము. ధన్యోస్మి. ధన్యోస్మి.

సీ॥ వ్యభిచారవృత్తిని నభిలషించిచెడిన
పాపులారా! లేచి భక్తిఁగొనుడు
ఒండొరులకుకయ్య మొనరింపయత్నించు
పాపులారా! లేచి భక్తిఁగొనుడు
చోరత్వమందాత్మ జొన్పినశించెడు
పాపులారా! లేచి భక్తిఁగొనుడు
ఒరులకలిమిఁగాంచి యోర్వజాలని నీచ
పాపులారా! లేచి భక్తిఁగొనుడు
గీ. నేడుమేలఁగి రేపె? నశించు నీచులార!
నేత్రయుగళంబుఁ దెఱచి వి నిశ్చలమతి
సత్యమందాసక్తిఁబ్రబల సత్పథంబు
నడచియనఘులై కాలముఁ గడుపరెండు.

వ. బాహ్యాలంకారములచే రాజిల్లుచు సూనృతము నశోగతి పాలుగావించు నీ మాయలోకంబున నరజన్మ గాంచుటయే దుర్లభము. నరజన్మ సార్థకంబగుటకు,

భక్తియుక్తుండై యతి యనంబరగుట కడుదుస్తరము. శాశ్వతానందకందళితహృదయారవిందుండై వర్తింప వలెనన్న నీ వసుతకులపైంగల బ్రాంతిఁబోనాడి సర్వ మపి సన్యస్తంబని యీషణత్రయంబు మంటఁ గలపి మెలంగు నతండు పుణ్యపురుషుం డనంగఁబరగు.

రా: కళ్యాణి తా: ఏకత్రిశ.

కనుమీాయు నంతనేలో-కము ధనము నశించునరయ- ఘనపరేశు భక్తినిలుచుర్ర-ఘనహీనంబగుదుప్రష్కియ- లొనరింపక దైవనీతిఁ-గనుఁగొన యత్నింపుము ధూ- షణలనంది వరలవలెర్ర॥కను॥

1. భగవంతు స్వరూపమును-పడసినట్టి నరుఁడు దైవ-భక్తి నిలుపకుంట చింత=యగణిత సర్వేశుఁగృపను-జగసం క్షోభనునడంచి-పగసాధింపకను శిష్ట- తెగనుగడిసి బ్రతుకవలెను॥కను॥

వ. (పరిక్రమించి) అల్లదే; యఘాకరుఁ దీక్షబాణశర పరంపరుల సంతప్తులై దేవుని నీతిని గనలేకఁ దహా తహాపడెడు జనులసంఘమటఁ గన్పించుచున్నది. నేనట కుంజని వారల సన్మార్గావలంబుల నొనరింతుఁగాక.

రా: మాండు. తా: ఆది.

శ్రీకారుణ్యుండా! విమలాత్మా!-లోకజనాళి రక్షింపు మీాశా!!! భీకరనాధుసాతాను వాగురులలో-బెనఁగొని నరులు నశించుచునుంటి-రాకర్షించు శుద్ధాత్మసహా యము-చే కాపాడుము సద్గుణాదుర్యా! ॥శ్రీ॥

— • — (నిష్క్రమించును.)

# భక్తయోహాను.

## ద్వితీయాంకము.

### (ప్రథమరంగము.)

(పౌరులగు మెహీందా, హన్నా, బర్కోసు, తెమహు, బజ్లీతు ప్రవేశింతురు.)

రా : జంగ్లా. (చాయ। రామయ్యతండ్రి) తా : ఏకతిశ్ర.

రాసులవలెఁ బెరిగెనుమన - దోసములన్ని - నాశన
పాత్రులమైతిమి - యేసునియెదుట ॥రా॥

1.ముంచేయోహానను సన్యాసియెదుటను- వంచన జేయఁగ
వీలిక లేదుర తండ్రీ॥రా॥

మెహీందా—ఒరే! అన్నలారా! ఏందిరా యీకర్మం? ఓడో సన్నాసోడంటా, పాపాలన్ని కెలికేతుండంటా, ఓడిని లచ్చాం సేయడంట, సెవుగోసిన నక్కలాగ వాగటమే వాగటమట. ఓర్ బర్కోసా! ఆడిపేరు నీకేమైనా తెలుసునంట్రా. ఆడిపేరు నోట్లో ఆడ్తుంటది గాని పల్కచేతగాదు.

బర్కోసు—ఆడిపేరు ముంచేయోవానుగాదంట్రా. ఎర్రిబోగ్‌లోడా!

హర్షా—ఆడోస్తే నాకేమి భయమురా. నేనగ్గింటోడినిగదూ?

తెమహు—ఏందిరో. కనిమెట్టి మాట్లాడరో నీయంత ఉభా చారి, నీయంత దొంగోడు, టక్కరోడు, నీయంతనక్క జిత్తులోడు లోకంలో యింకొకడు యున్నాడంట్రా?

బజ్లీతు—(ఏడ్చి) ఓడిసేసినపాపాలు, ఆడిమొఖాన్నే అడుగు తాడుగామాల, ఇప్పుడో కాంచేపట్కి దూకుతాడ్ గామాల. అయ్యసంగతి ఇన్నప్పటాల్నుంచా, నా గుండెల్లో గుడాబడా అంటుందిరా.

ముహీదా—ఓరే! బజ్లీతా! నీకెందుక్రా దడ?

హర్షా—ఓరే! ఉడ్ మొకోడా! దడెందుకు అంటావేందిరా? బాగాలు పంచోకనేటప్పుడే చెంబూ, తపేల పంచు కోటంలో తగాదావస్తే, యీడితమ్ముని గొడ్డల్తో నిలువంగ పడగొట్టింది ఈడుగదూ? మర్దేమ్ము సల్ మేల్ సేస్తే ఈమజ్జే ఇరోదాన యీడి మామ్‌గాడి సేనంతా ఒక్క రేత్రిలో పీకేయించినాడే! మంచో డనుకొంటుండావేంటి?

బజ్లీతు;—నిజమేనయ్యో! నిజమే, బజ్లీతుగాడంటే దేశమంతా . బజీతోడని పేరుమోగిందిగా!

తెమహు;—ఒరేహర్షా! ఆడిసంగతి అంతగా సెప్పుతుండవే? బందిపోటుదొంగల్లో మొనగాడోడంటే నీవని పేరు. మోగలేదంట్రా!

బర్కాసు;—ఆదరం అట్టాంటోలమేలేరా? ఇగ్గో సత్రంగ బతికినోడోడా! ఓణ్ణోదప్ప పుటోన్లలాతా పాపాసేసి నోళ్లే? ఏమిరా, మెహీందా! నీవేటంటావ్.

మెహీందు;—నిజమేరా ? నాకళ్ళతోస్తుందది, ఆవానా భాప్పుడు మనకాడికొచ్చి మనపాపాల్కు చాంతికలి గిత్తాడేమో! ఓడి పాపాలు ఆణొప్పుకుంటా డాగ్రా?

బర్జీతు;—ఓ! అందుక్కు మొదటోడ్ని నేనూ!

( తెరలో యోహాను పాడును. )

రా : పూరికళ్యాణి. తా : ఏకతిశ్ర.

గిరులచందమున బెరిగిన-దురితరాసులను బోనాడుడి-
పరమరక్షకునిసన్నిధిc - బాపములను విడువరండీ? ॥గి॥

మెహీందు—చూసినార్రా! దేముదుసెక్తి. అనుకుంటుండ గానే ఈ మానుబాపున్ని తీసికొనివచ్చినాడే! రండ్రో! యెదురుగాబోదాం.

యోహాను— (ప్రవేశించి)

1. మిత్రులార! మీరుమనస్సు - ధాత్రినొందకున్న నరక
పాత్రులైసతంబు వెతల - పాలగుదురు నిజము నిజము
॥గిరు॥

అందరు,—మానుభావా! ముంచేయోవాను మాత్మా! దండాలు దండాలు.

యోహాను;—దైవాశీర్వాదప్రాప్తిరస్తు.

సీ. నిర్దయులై దైవ । నియమంబులంద్రోచి
నరకాగ్ని మ్రగ్గంగఁ । దరలినారు
తెరువరులఁదునిమి । దురితంబు గడియించి
నరకాగ్ని మ్రగ్గంగఁ । దరలినారు
కూటసాక్ష్యములిచ్చి । కొంపలుగూల్చుచు
నరకాగ్ని మ్రగ్గంగఁ । దరలినారు
భక్తులశిక్షించి । పాపులక్షమియించి
నరకాగ్ని మ్రగ్గంగఁ దరలినారు
గీ. పవలురేలు వేశ్యలరతిఁ । బడయఁదిరిగి
సత్యవ్రత సతీమణుల వి । చారసాగ
రమునఁ బడవైచి గృహధర్మ । క్రమముఁదప్పి
దైవకోపాగ్ని మ్రగ్గంగఁ । దరలినారు.

వ. అక్కటకటా! ఒరుల మనస్సు నొప్పించుట పరమ భక్త్యాశక్తి నెదఁగూర్పఁదలపడెడు భక్తుల నోటార దిక్కరించుట న్యాయాధికారులయాజ్ఞలదిరస్కరించుట మోసంపుటురులఁబన్ని నిష్కపటుల సిలుగులనందజేయుటాదిగాగల దుష్కృతులొనర్చి భగవంతు నుచితకృపా వరంబులకు దూరస్థులై మెలంగెడు మీరా జగద్రక్షకుండు విధించు శిక్షనెవ్విధిఁ దప్పించుకొనగలరు?

మొహిదు;—మానుభావా! ఏందంటావ్, మేమ్‌చేస్న నేరాల్లు, చిచ్చుండాదంటా ?

తెమహు;—భేసురమామా! నే నడుగుదా మనుకుంటే నీవే
అడుగినవు గదునే?

మోహను;—ఓ! లేక నేమి? మానవుఁడొనరించు వివిధ
దుష్కృతములన్నింటికి మాయశిక్ష గలను. ఎట్లందురా?

సీ॥ పరకాంతలంగోరు ~ నరుల నరకమున
గొడ్డంగ్రతోనెత్తిఁ ~ గొట్టుచుంద్రు
కుటిఁబన్నుచుఁ ~ గొంపలఁదెగఁగూల్చు
చెడుగుజనుల పొట్టఁ ~ జీల్చుచుంద్రు
మృషలాడు వారల ~ మూర్ఖులఁ జోరుల
తప్తతైలంబున ~ దడుపుచుంద్రు
పలుకని తరుల శి ~ లల మొక్కునరులను
అరవంగఁ దెగఁగొంతు ~ నరుకుచుంద్రు

గీ. హింసకుల హంతకులనెప్డు ~ హేళనమ్ము
సేయు వారలఁ దాగ్రి ఘూ ~ షించి సంత
పించువారల నసిపత్రి ~ సీమలందు
ద్రిప్పుదు రిదియెనిక్కంబుఁ ~ దెలిసికొనుడు.

రాః మోహన తాః రూపకము.

సర్వసంతానమా! - సర్వేశోగ్రతకుఁ దాళఁగలర? నేర్పుఁ
గల వారల మటంచు - నీల్గిదైవభక్తి విడచి_ నిర్మలానందంబుఁ
ద్రోచి-నిత్యంబల నరకాగ్నిని బడఁజూచుట దుఃఖంబయో?॥స॥

అందరు—అమ్మబాబయోా! ఇంక మనకుగతేదుంది! సోమీా!
(నమస్కరించి) మమ్మల్నేమిసేయు మంటావూ?

యోహాను—ఓ! యెరూషలేము, యూదయపురవాసులారా
చేయునదేమున్నది? వినుండు.

గీ॥ పాపములానరింపఁ దలఁపఁ గ బాడిగాదు
నూత్నజన్మంబునొంది వి గ నోదమొంద
సత్క్రియలసేయ యత్నించి స్నానమిపుడె
బ త్తిఁగొనుఁడు మీపాపముల్ గ బాసిపోవు.

వ. వింటిరా! పాపవిముక్తి నొందఁదలతురేని పశ్చాత్తప్త
హృదయులరై బాప్తిస్మమందుట వశ్యాచారణీయము.

అందరు—చిత్తము. చిత్తము. యోవానయ్యా. అదిసరేగానీ
మరిమాకు ముంచడం యాడిత్తవ్?

యోహాను;—పౌరులారా! అల్లదే! యొర్దానునది. దానిలో
దైవబిడ్డలను గురుతుకొరకు మీకెల్లరకుఁ బ్రభువుపేర
బాప్తిస్మమిత్తును, రండు.

హర్షా;—ఓరే! తెమహు! ఈయాలలేసినయేలబలేమంచిదిరా!

తెమహు;—నిజమేనురా!

బర్జీతు;—ఓరే! మహీందా! ఈయాలమనంసేసిన పాపాలన్నీ
పటాపంచలై పోతాయిరా; సోమీ! పదండి.

యోహాను;—నడువుడు.

రాః శంకరాభరణము. తాః ఆది.

దేవుని భజియింపఁగరండీ! - దీనులుగా బ్రభుఁ గొల్వ
రండీ! —భావార్థము ఫలియించుగదే! - పాపోపశమ
సంబొందఁగనగును॥దే॥

(నిష్క్రమింతురు)

# ద్వితీయాంకము.

## ద్వితీయ రంగము.

---

(హేరోదు, హేరోదియా, సలోమి, సెఫన్య, హాజర్య ప్రవేశింతురు)

హేరోదు;—హాజర్యా! చతురంభోధి పరీతభూవలయము నిరంకుశంబుగఁ బరిపాలించుచు సకలసద్గుణ సౌందర్య రాసియై విలసిల్లు మదీప్సిత తరుణీమణిని గ్రహించి యపార సౌఖ్యాంబుధి నోలలాడు నాయట్టిధన్యాత్ముం డగు భూజానుండీ మహీతలంబున వేరొకండు గలండే!

సీ॥ కాంచనభవనము ♫ లగ్గట్టించి ప్రజలకు
విశ్రాంతి నొడగూర్చి ♫ వెలయుచుంటి
రక్షకభటకోటి ♫ రాజిలసమకూర్చి
పరిపంధి వర్గముఁ ♫ దరుముచుంటి
ఘోరిభసింహాసనా ♫ పాంభవమణులలోఁ
దేలి ప్రశస్తము ♫ గాంలుచుంటి
సురుచిర నవరత్న ♫ శోభితంబగు భర్మ
మకుటంబు ధరియించి ♫ మసలుచుంటి
గీ॥ భూతలంబున తేండ్లచే ♫ బూజలంది
వలయు విత్తంబు సమకూర్చి ♫ వసుధనెల్ల
నేకఛత్రింబుగా నేలు ♫ ఘాక కెలమి
తలలు వ్రాల్చెదు రాజుల ♫ దశనుగంటి.

హాజర్య—చిత్తము. దేవరవారి యసమానగంభీరశక్తి యుక్తమోత్తములకు భూవల్లభులకు గ్రాహ్యంబై మెచ్చెరు వందుచు, మిమ్ములమార్గాన భయకంపితులరై సంచరించుట వాస్తవమే.

రా: జంఝూటి తా: ఏక.

(ఛాయ॥ జగదీశు మాయలను)

నరణీశ సువిమల - ధార్మికతలఁపుల - నరులకు గోచర
మానే? సిరిసంపదలు భూ - షింపఁదగిన యశము—
పరిజ్ఞానోదయ ప్రాజ్ఞతశ్లాఘ్యము.

హీరోదు—భేష్. నిక్కము వచించితివి. నాప్రతాపముజ్జ్వల సామ్రాజ్యసుస్థితి ప్రేక్షకులకుఁ గనులపండు వొనరించు గదా?

హీరోదియ—ప్రాణవల్లభా! మనరాజ్యము వైచిత్ర్యాదులపై మంత్రిసత్తముండు వచించిన ప్రణాళిక కేవలము శ్లాఘాపాత్రము. కానిమనపరిచయానుబంధమునకోర్వజాలక సత్యాగ్రహసాధువనెడు పేరంబరగు బాప్తిస్మమిచ్చు యోహానను పలువిధముల నధిక్షేపించు చున్న వాడట.

ఉ॥ ఇంతటిరాజచంద్రునకు నిద్ధర ముద్దులజాయనయ్యు భూ
కాంతుల కాంతలన్ వినుతిఁ గన్న నెలంతుకనయ్యు భక్తిసి
ద్ధాంతుల సన్నిధానమున ధార్మికసత్య సుశీలనయ్యు నా
హంతకుఁ డట్టులాడగ నహహా! మనకెట్టుల నోర్పునందెదున్

హేరోదు—దేవీ! ఆనీచుఁ డటుల వలెకెనా ? నీనుడులు. తధ్యంబులు. ఆతని నిటకు రప్పించి తగిన శిక్ష నొనర్తుఁగాక !

రా : బ్యాగు. తా : ఆది.

హా! దేవి! దుఃఖంబు - నందంగవలదు - ఆదాసు నీ ఖడ్గంబునఁద్రుంతు నిపుడే!—పాదంబునబడి కాలము గడిపెడు - పాపాత్మునకీతలఁపేల? - వాదించుటకును మారాడుటకు - నాదిశఁగననగునే-సాధించియు శిక్షార్హునిగానే-సరగఁజేతుఁ జింతిల్లకుమింకను ॥హా॥

వ. ఊరడిల్లును.

సెఫన్య—అమ్మా! ఎన్నికలేనట్టియు, యోర్దానునదీ పరిసరములఁ బిచ్చివానివలె విహరించునట్టి బాప్తిస్మమిచ్చు యోహాను వాగ్ధాటికి మీబోంట్ల స్తోత్రార్హులు లక్ష్యము సేయఁదగదు. అల్పులు భూవరేణ్యుల నేమి సేయఁగలరు?

హేరోదు—అవును. అది యటులుండనిమ్ము. నేనొకటి జెప్పమరచితి.

సలోమి—జనకా! ఆయుదంతంబు నే వినదగునా?

హేరోదు—పుత్రీ! సలోమి! మదీయజన్మదిన మహోత్సవము రాబోవు మాసారంభమున జరుగనున్నది. మీకు సంతసముగదా?

సలోమి—జనకా! సంతసముగా క్షేమున్నది. ఆమహోత్సవ దినంబున సమావేశంబగు సభ్యులసమక్షమున మదీయ నాట్యకౌశల్యము వెలిబుచ్చెద. ఏలనన,

గీ॥ జనకు మెప్పించుటయె? జన్మ సార్థకంబు
సజ్జనుల ప్రేమగొన జన్మ సార్థకంబు
సత్క్రియలొనర్చుటయె జన్మ సార్థకంబు
గాన నాట్యచమత్కృతిఁ గనఁగఁ జేతు.

సెఫన్య—అమ్మా! నీవొనరింపఁ దలఁపడు విధివిహితకృత్యమున కెంతయు సంతసించితి. చిరంజీవివగుదువుగాక!

వచనకర్త:—(ప్రవేశించి)

గీ॥ రాజరాజాధిరాజ! వి రాజమాన
కీర్తిశోభితవేగంబె గేహమునకు
జనెదు సమయంబిదేయల్ల శశిధరుండు
గగనమధ్యంబు జేరెను గదలవలయు.

హేరోదు;—దేవీ! అభ్యంతరమునకేగు సమయమతిక్రమించు చున్నది. రండు పోదము.

(నిష్క్రమింతురు)

# ద్వితీయాంకము.

---

(తృతీయరంగము.)

( కిరాతులు పాడుచూ ప్రవేశింతురు. )

రా: ఖరహరప్రియ. తా: ఏకతిశ్ర

తప్పులను బైటబెట్టు_తరుణమింక వచ్చినది - యొప్ప
కొనక దీరదయ్యో - యోవానుయెదుట_తప్పులన్ని
యొప్పుకొంటి - దగినశిక్షఁగలుగునేమొ - చెప్పకుంటె
శాపమేమొ? - మెప్పనొందకున్న బాగే - తప్పులన్ని
చెప్పుకొందామ్॥త॥

మొదటికిరాతుఁడు;—ఏందిరేస్. యోవాను మనెంటబడ్డా డేందిరా. బారెడుగెడ్డామ్, మూరెడుమీసం యేసు కోని సెనిగాడ్లాగ.

రెండవకిరాతుఁడు;—ఓరే! అరవబోకురా! కొతిమీరజుట్టోడ! ఈడేడైనా యుండాడంటే నిపని నాపని పడుతాడురా.

మూడవకిరాతుఁడు;—(దిశలుపరికించి) ఒరేఒరే! ఏందది? దూరాన్ని దుమ్ములేస్తుండాది. తాలంద్రో, దేబిరి మొఖమోల్లారా! (నాలుగవవానింజూచి)ఓరే! అన్నా! అదేందోసూడ్రా!

నాలుగవకిరాతుఁడు;— (చూచి) ఇంకేముండది. అడిగో! యోవాను పిల్లలకోడిలాగ పదిమందిని యెంటేసు కొస్తున్నాడు. ఇక తప్పులొప్పుకోకతప్పదు.

మొదటికి రాతుఁడు;—ఎప్పుడేదో వాగుతునే యుంటాడేం దిరా?

రెండవకి రాతుఁడు;——సోములవారిమీద బత్తిరా! ఎఱ్ఱి మొగమా!

మూడవకిరాతుఁడు;—అరవమాకండెస్. రాంగానే ఆమాయ్న పాదాల్ మీద పడదామ్. ఈసోలుపున నిలబడండ్రి!

(నిలుతురు)

(యోహాను జనులుబ్రవేశింతురు)

యోహాను;—

రా: హంసధ్వని. తా: ఆది

కూరిరులార!మీ-నేరముల్ గిరులవలెబెరిగె
నీరుఁజెౘ్ప్రభు-తీర్పు నొందవలయు
మారుజీవనమును-మహిని జూపలెండు
చారుమారుమనస్సు-సంపాదింపవలయు॥కూరి॥

కిరాతులు;—(పాదములపైబడి)స్వామీ! దండాలు. దండాలు.

యోహాను;—ఓహో! మీరలిచటనుంటిరా! వెతుకబోయిన తీగ గాళ్లకు దగులుకొనినటులాయె. లెండు. భగవద్దర్శనప్రాప్తికై వేచియుండుడు. జనులారా! మహామహుండు ననితరలభ్య గుణగరిష్ఠుండును జగద్రక్షకుండాద్యంత రహితుండును దీనులపాలిటి పెన్నిధియు ననంతకళ్యాణగుణ విశిష్టుండును నగు శ్రీయేసునాథ స్వామిమీమీహృదయక్షేత్రంబులనివసింపనిచ్ఛగించు

చున్నాడు. మీమానసములు గాఢాంధకారమగ్నములై కలుషపూరితములై దుష్టతలంపులకునికిపట్టులై దేవుని కృపావిశేషంబుఁ గనఁజాలక నాధారరహితులై మ్రగ్గుచున్నవారలు. మీరు హృదయపారిశుద్ధ్యము నొంది కారుణ్యుఁడగు శ్రీయేసురక్షకుఁడు మీయుల్లంబుల నివసింపననువగురీతి మార్గముల సరాళమొనర్పుడు. పాపంబులనంబరగు పెనుబండలఁ బ్రభునడయాడు మార్గంబులనుండి దొలగింపుడు. సర్వశరీరులు దేవుని రక్షణభాగ్యము గొనవలెనన్న సత్ప్రవర్తనులరై దుస్సహవాసములువీడి సజ్జనోచితకర్జంబులనొనరింప ముందంజవేయవలయు.

సీ. సకలపాపాత్ములు ♪ సర్వేశుసన్నిధి
యఘములబోనాడి ♪ యలరవలయు
జీవముండగనె స ♪ చ్చిదాత్రిపుదేవుని
ధ్యానంబు సేయంగ ♪ దలఁపవలయు
పాపులారా! యగ్నిఁ ♪ బడకమున్నె పరేశు
శిష్యులై భక్తిని ♪ జేయవలయు
మృషలువల్కక సదా ♪ మృదువొప్ప సత్యంబు
వలికి పుణ్యాత్ములై ♪ వరల వలయు
గీ. ధరపయోముఖ విషకుంభ ♪ మొరిగినేల
గూలి శ్లాఘ్యమందనటుల ♪ గుత్సితజన
మట్టులె తుదకు ఘనమొంద ♪ రిట్టిబాహ్య
వైఖరివిడిచి శుద్ధాత్మఁ ♪ బడయవలయు.

కిరాతులు;—సోములోరూ! సెవ్వుసెప్పిన బోదింటూవ్వుంటే భయమేస్తుంది. అన్నేండ్లాల పాపాలుసేసి సెడిపోయున్నాము.

రా: నాధనామక్రియ తా: ఆది

నీచమైన పాపాలేసి - నీటిరవ్వాంతలేక పాడైనాము
సోమీ—దాచలేము మాపాపాలు - దబ్బున మా
పాపాల్దీసి - ధర్మాత్ములుగ జేయుమయ్యా! దండా
లయ్యా! సోమీ!

వ. సోమీ! మాకుసిగ్గేస్తుంది. ఇకమీదట నేరాల్ సేయము.

యోహాను;—జనులారా! మీరుపవిత్రులై క్రీస్తు నడుగుజాడలలో మెలఁగ మారుమనస్సునొందితిరి. బాప్తిస్మమిడి దైవభృత్యులుగ నొనరింతుగాక.

(సుంకరులు ప్రవేశింతురు)

సుంకరులు;—మహానుభావా! భగవంతు గారాబుబిడ్డలవలె నీవసుంధర వెలయ నిచ్ఛగించి బాప్తిస్మమొందవచ్చితిమి. మేమేమిచేయనగునో దెలుపుడు.

యోహాను;—సుంకరులారా! మీయభిమతంబు శ్లాఘ్యము.

ఉ॥ సుంకరులార! సంతతము సూనృతవాదులరై మనోజ్ఞతకంకములాడకండి కడు బీదల జేదుల నొక్కరీతి ని
ష్పంకమనంబుతోగనుచు పాడిగలట్టి నృపాలునాజ్ఞచే
సుంకము నిర్ణయించువిధి చొప్పదలంకక స్వీకరింపుడీ.

వ. గ్రాహ్యంబయ్యెనా? మీకు నిర్ణయింపఁబడిన సుంకముకన్న నెక్కుడు గ్రహింపఁ దలపడకుఁడు.

[రాణువవారు ప్రవేశింతురు.]

రాణువవారు—భగవంతునిరాయబారీ! మేమొనర్పఁదగిన విధికృతములెవ్వి?

యోహాను—అకటా! నిరపరాధుల వెతలబెట్టెడు రాణువవారు మీరుకారా?

సీ. శిక్షార్హుల విడిచి శిష్టుల శిక్షించి
చెఱశాల నునిచెడు చెడుగులార!
గౌరవార్హులకొంప జారులపాల్జేసి
శోకాబ్ధి ముంచెడు చోరులార!!
పరసతీమణుల జే బట్ట వాంఛించెడు
దుష్టులార! నరని కృష్టులార!!!
రక్షకభటులుగ రాజ్యమున మెలఁగి
చోరులఁ దెగరేపు శూరులార!!!!

గీ. లంచములఁ గొంచు బరుల వంచించు క్రూర
కఠిన హృదయులార! భయద కర్ములార!!!!!
పరుల మీఁదలెగనుడు స ద్భావమలర
ప్రాప్తమైనట్టి ధనముతో దృప్తిఁగొనుడు.

వ. యోధులగు మీరు పరమేశ్వరు చిత్తానుసారము వర్తింతురేని లోకమునకు మేలుసేయువారును దైవప్రేరణమునకుఁ దోడ్పడువారునై యుందురు. "లోక

మును దాని ఆశయు గతించి పోవుచున్నవి. గాని దేవుని చిత్తమును జరిగించువాడు నిరంతరము నిలుచును." మీారు మోక్షంబున సుఖమంద నిరంతరము నిలువవలెనన్న దేవునిచిత్తము నెరవేర్చుడు.

రాణువవారు—బోధకుండా! నీవు చెప్పినచొప్పున సంచరింప యత్నింతుము.

రా : శంకరాభరణము, తా : ఏక.

పరమాత్మునిసాయంబున మా-పాపంబులుబోవునటంచు
బాహాటంబుగఁ దెలియంగలింగితిమి = పరిశుద్ధంబగు
బాప్తిస్మంబు-సరగనొసఁగి ప్రమదంబొడగూర్పుము॥ప॥

యోహాను;—సరియె! మీా హృదయ వాంఛనీడేర్తును.

రా : శంకరాభరణము. తా : ఏక

విడువక విశ్వాసంబున మీా - రడిగెడు విధమున
ముంచడము వేడుకలర నొసఁగెద నీయోర్దానదిన్ =
గడచిన కాలంబునగావించిన-చెడుగుబనులకై జింతిల
వలయు॥ వి ॥

సుంకరి;—(జనులఁగని)మిత్రులార ! ఈమహాత్ముండు క్రీస్తు గా యుండునేమో! ఈతని సద్భావము నరయ గడుంగడు చిత్త మొడగూర్చుచున్నది.

జనులు;—అవును. నిక్కము వచించితివి. తప్పకీతండు క్రీస్తు యని విస్పష్టమగుచున్నది.

యోహాను;—జనులారా !

చ. మనుజుఁడనై బరేశునకు మార్గము సిద్ధమొనర్చు దూతనై
బనివడి నీళ్లలోఁ బ్రజకు బాప్తిస్మంబు నొసంగుచుంటినా
యనుఁగువిభుండు యేసు విమలాత్మలో నగ్నిలో స్నానమీయవ
చ్చు నిది నిజంబు సంతతము సూనృతవాక్కులరై జరింపుఁడీ.

వ. గ్రాహ్యంబయ్యెనా? ననుమించు శక్తిమంతుం డపూర్వ కాంతిచే నొప్పారుచు బ్రజాళి క్షేమ మరసి రక్షింప విచ్చేయుచున్నాఁడు. అమ్మహాత్ముండు శ్రీ యేసుక్రీస్తుం డని గ్రహింపవలెను.

ఉ. మేరికుమారుఁడున్ జనులకు మేలు దలంచుచుండు సజ్జనా
ధారుఁడు సత్కృపాపటిమ దైన్యమునుం దొలఁగించువాఁడు దు
ర్వారు మెసయ్య పాదుకల వారుల విప్పనశక్తుఁడని రా
ధారులఁ బ్రోవఁ దా వెడలు దారమనంబున నిచ్చగించుచున్.

వ. లోకభారావతారణార్థంబు రిక్తునివలె నుద్భూతుండగు క్రీస్తువిభుచంద్రుండు కృషీవలుని చందంబున దనచేటఁ గరతలంబున నిడుకొని సజ్జనుల గుష్టులఁ దూర్పారఁ బట్టి గట్టిగింజలం బోలు నిష్కల్మషహృదయుల మోక్షంబనియెడు కొట్టునం జేర్చి పొట్టుగఁ బరిగణింపంబడు జడమతుల నిరతమారని యగ్నిచే నొప్పారెడు నరకంబునఁ బడవైచి మ్రగ్గంగఁ జూచును. రక్షకుండగు యేసు నెరుఁగనిచో సమస్తాలంకృతములు సున్నయని గ్రహింపవలయు.

సీ. భూనభోవిజ్ఞాన । ప్రాగ్ణతాయుతుఁడయ్యు
నేసు నెఱుగకున్న । మోసమన్న !
విద్యావిశేష ప్ర వీణతల్ గల్గియు
నేసు నెఱుఁగకున్న । మోసమన్న !!
ధనవంతులై ప్రజా । ధర్మమెఱింగియు
నేసు నెఱుఁగకున్న । మోసమన్న!!!
నవనాగరికతచే । న్యాయవాదులరయ్యు
నేసు నెఱుఁగకున్న । మోసమన్న !!!!

గీ. విప్రులైన శూద్రులయిన । వీరులైన
సాధులైన సద్భావనా । సక్తులైన
ధరఁ గవీశ్వరులైన బ్ర । ధానులైన
నేసు నెఱుఁగక నున్నచో । మోసమన్న !!!!!

రా : బంగాళతోడి. తా : ఆది.

పరమాత్ముఁగృపంగనంగఁ - దరుణంబిదియే - బిరాన
నేసుఁ నుతింపుఁడీ=దురితేచ్ఛలవిడి - దుష్పథినడువకఁ -
బరితోషంబున మెలంగుడింక॥ప॥

సరససౌఖ్యవితతి ని-ష్కపటహృదయ తలమున-
పరిఢవిల్ల నేసుక్రీస్తు-చరణముల భజింపవలెను॥ప॥

జనులు:—పాపంబులొనరింపకఁ-బ్రభుఁడేసుపాదంబుల భజి
యింతుము=శాపంబులఁదెగటార్చెదు క్రీస్తుని-కోపము
రేపితిమయ్యయ్యో!॥పా॥

ఆపుణ్యాత్ముఁగారుణ్యాం-బాకర్ణింప మేలొంది-యా
పట్టునబాప్తిస్మంబింపుగ నందఁగ జనితిమి॥పా॥

యోహాను:— సోదరులారా! ఇల్లదే యోర్దానునది నాకు
మీకు బాప్తిస్మ మనుగ్రహించెద రండు.

(నిష్క్రమింతురు.)

శ్రీ

# భక్తయోహాను.



## తృతీయాంకము.

(ప్రథమరంగము.)

(హేరోదు, హేరోదియ, సలోమి, హాజర్య, భటుఁడు ప్రవేశింతురు.)

హేరోదు—మంత్రివర్యా! పురజనుల సమక్షమున మా విషయ మపారకోపావేశంబున ముంచే యోహాను తిరస్కారోక్తులు బల్కి నటులఁ దెలియవచ్చెను.

హాజర్య— దేవరా! నే నటుల విననైతి. నటులైన మనమేల యామూర్ఖుని రప్పించి శిక్షింపఁగూడదు?

హేరోదియ;—మంత్రివర్యా! బాప్తిస్మమిచ్చు యోహాను భక్తాసక్తుండనియు నాతనిశిక్షింప నుద్యమింప హాని వాటిల్లుననియు నామనోవల్లభుండు వెఱగొందుచుండు నటుల వర్తింప సమంజసముకాదు.

సీ. భూవల్లభులఁదిట్టు ॥ బుణ్యాత్ములకుఁగూడ
శిక్షముఖ్యంబు వి ॥ శిష్టజనుఁడ
ధరణీపతుల పేరుఁ ॥ జెరుపు దుర్జనులకు
శిక్షయవశ్యంబు ॥ శిష్టజనుఁడ
భూజానుల ఘనంబుఁ ॥ బోకార్చుఖలులకు
శిక్షయవశ్యంబు ॥ శిష్టజనుఁడ
జనపతులయనుజ్ఞ ॥ జవదాటుజనులకు
శిక్షయవశ్యంబు ॥ శిష్టజనుఁడ
గీ. భూపతుల గౌరవింపక ॥ బుణ్యశీలు
రమని స్వాతిశయంబున ॥ రంకెలిడెడు
పోకిరి జనంబులకు సదా ॥ పొంకమడఁగ
శిక్షయావశ్యకంబిల ॥ శిష్టజనుఁడ.

హాజర్య:—అమ్మా! తమ భావగర్భితములగు వాక్యములు సత్యములు. భూపశ్రేణ్యుల శ్లాఘించుటకుమారు దివసస్మరించుట ధర్మము.

హేరోదు—దేవీ! హాజర్యా! మీరిరువురు రాజులకనుగుణ్యమగు స్వాభావిక ధర్మంబుల వెలిబుచ్చితిరి. ఐన

సీ. దుర్మదాంధులఁ ప్రేమ ॥ తోఁగ్రహించినయెడ
సత్ప్రవర్తనులౌదు ॥ శక్తిఁగాంతు
జడమతులంజేరి ॥ చక్కంగసద్బోధ
లొనరింపసాధులై ॥ యొప్పుచుందు
భూజానులగురుత ॥ బోకార్చుదుష్టుల
దిద్దుటవలన వి ॥ శుద్ధిఁగొందు

నరహంతకుల సమా । దరమున జూచుచో
ప్రాజ్ఞులై భక్తులై । బాగుమందు
గీ. బింకమున రాజద్రోహులై । జంకకుండ
శుభమతంబు లీడేర్పంగ । నడకువవిడి
సంచరించుచు దుర్మార్గుల ♦ సవినయమున
బలుకరించుటచే ముక్తి । బాటుగందు.

వ. దుర్మతుల శిక్షించుటచే వారి వజ్రకాఠిన్యహృదయము మరల్పంజాలమని నాయభిప్రాయము. మరియు నాతడు దుర్మార్గుండనంగం జెల్లడు.

సలోమి — జనకా! ప్రప్రథమాంబున దమప్రసంగవశంబున వెలువడిన వాగ్ధాటినే నాకర్ణింపంగ యోహాను తమ పల్లె జనులసముఖంబున నేరారోపణ మేరీతిబరిణమించెనో గ్రహింపకుంటి.

సీ. భాగవతశ్రేణ్యులపట్ల । బూర్ణక్రోధము దాల్చి
చెడుగుండా ఉండువాని । జెలుపనగును
భూపతుల విషాద । కరపాపంబులో జొన్ప
బంకించు దుష్టుని । బట్టనగును
దుష్టునిపలంగ త్రిప్ప । మానుమనగును
దేవతల యశంబు । నగుబాటు జేసిన
...తహృదయుల । గూల్పనగును
గీ, పూజ్యులగు పెండ్లనె జిన్న । బుచ్చదలంచు
మాయగాండ్ల శిక్షింపుట । న్యాయమవును

రాజభక్తి లేనినరుల ॥ రాజ్యమందు
నిలుననీకఁ దరిమివేయ ॥ వలయు జనక!

(కంచుకి యోహానురాకడ రాజేంద్రునకు దెలుపఁ బ్రవేశించును)

కంచుకి—దేవరవారికి జయము జయము.

హేరోదు—భృత్యా! నీవువచ్చుటకు గతంబేమి?

కంచుకి—దేవరవారిని సందర్శింప బ్రాప్తిస్నానిచ్చు యోహానను సన్యాసివచ్చియున్నవాడు. సెలవొసంగిన గొని వత్తును.

హేరోదు—మంచిది. ఆతనిబనుపుము. పొమ్ము.

కంచుకి—చిత్తముదేవరా (నిష్క్రమించును)

(యోహాను పాడుచు ప్రవేశించును.)

రా: బ్యాగు తా: ఆది.

పాపవారాశినిబడిదేవ్రుఁ - గోపమిద్ధర రేపకుడు
శ్రీపరాత్పరుఁ ధ్యానమించుకఁ-జేయకుండుట చింత
నీయం-బాపుణ్యాత్మునిఁ గృపఁగనలెందు॥పా॥

వ. హేరోదుభూపాలా! ప్రపంచసర్గమున జీవితులుగ గాలముగడుపుదనుక నితరులకు మాదిరిగజరింపవలయు గద! నీవొనరించినపాపము ఘోరమైనది.

సీ. సంపదంధుండవై ॥ సహజునిదారతో
వ్యభిచరించుట నీతి ॥ యనుటఁ దప్పు

న్యాయాధికారివై ॥ యనుఁగు సోదరు భార్య
వ్యభిచరించుట నీతి ॥ యనుటఁదప్పు
భూవల్లభుండవై ॥ భువి సహోదరు పత్ని
వ్యభిచరించుట నీతి ॥ యనుటఁదప్పు
ధర్మజ్ఞమూర్తివై ॥ తమ్మునినాతితో
వ్యభిచరించుట నీతి ॥ యనుటఁదప్పు

గీ. తమ్ముఁడీభువి సుతుఁడన ॥ దగినవాఁడు
సుతునిభార్యను గవయంగఁ ॥ బతితుఁడగును
యిట్టి దుష్కార్యమొనరింప ♦ హీనత యని
మనమునందించుకంతయు ॥ మఱువజనదు.

హేరోదు;—(కోపము) ఓయీ! జడమతీ! భూవరేణ్యుండ నని దెలిసియు నిర్భయంబున నిండోలగమున దూలనాడు చుంటివా? నీ కీయధికప్రసంగమేల?

గీ. భూవరేణ్యుండ నగుటచే ॥ బుద్ధిపూర్వ
కమున నేనొనరించిన ॥ కార్యసమితి
నెన్న నేపాటివాడవు ॥ హీనకులుఁడ!
మరల నిట్లాడఖండింతు ♦ శిరమునిపుడె.

రా: శ్రీ) (చాయ "పోబాల పొమ్మికః) తా: ఏకతిశ్రీ.

మారాడవలదికః - మాకడనిటు బలుకదగదు నోరె టులవచ్చె నిదియె యదనంచు వచించితివిగా! ధీరులు సయితంబీవసుధస్థలి-నేరమటంచు వలుకఁగ్గరె రి. ।మా॥

యోహాను; — పరాత్పరు సన్నిధిలో పాపం - బటంచును గ్రహింపఁగలేవే? — శరీరాశలచే నీనీచపు - సఖ్యతఁ గొంటివి దగదునీకిది

హేరోదు; — దూరాచారమొ? వ్యభిచారమొ? - భరింతునా యిచ్ఛఁదీరంగను - బిరాన నీస్థలంబును వీడిపొమ్మిక మరణమొందకుండనె నిపు ॥మా॥

వ. వ్యభిచారాది దుష్కృతము లొనర్చుచుంటినని మమ్ముల నిందింతువు? నీకు దైవభక్తి జేకూరినందున భక్తిమార్గంబున వర్తింపవలయుగాని లోకుల దూషించుటయేనా? నీమతము. ఇందులకై మాయల మారి జడధారివేషము ధరియించితివా? చాలు చాలు నోరుమూయుము.

యోహాను — ఓయీ! ఆత్మశ్లాఘపరాయణా! నీయుడత బెదరింపులకు బెదరి తప్పుల నిరూపించి నిత్య సన్మార్గావలంబునిగ నొనర్పయత్నింపక మిన్నకుండునని దలంచితివా! దైవప్రేరితుండనగు నాకేల నీభయము. నా విధ్యుక్త ధర్మమావశ్యకముగ నిర్వర్తించెదను. నీవధికారగర్వితుండవై దుర్మదాంధతచే మిన్నుగానక నాకెట్టిశిక్ష నొనర్పనుద్యమించినను నివారించినది మహాపాతకంబని నిస్సందేహముగ నిర్భయముగ నొక్కి వక్కాణింపగలను.

గీ. అల్పసుఖములనొందఁగా ¦ నాశఁజెంది
దైవభక్తుల నిందించి ¦ భావికాల

గతినరయక దుర్లిదవేమి? కలుషవంతు
డనఁదగితివి పరేశుఁ బెడనిడితివయొ!

హేరోదు—ఓయీ! యోహానూ! నీవాచాలత మేరమీరుచున్నదే. నిన్నిక నుపేక్షసేయఁదగదు. ఓయీ! భటులారా! ఈతని బంధింపుడు.

భటులు—చిత్తము (బంధింతురు)

యోహాను—ఓహో! ఇదేటి రాజనీతి. నిరపరాధుల నిష్కారణముగ బంధించుటయు, శిక్షార్హుల మన్నించుటయు నీదేశాచారమా? హేరోదియా! నీవలన హేరోదునకు చేటువాటిల్లెగదా! నావాక్యములు మఱొకప్పుఁ డనుభవమునకు రాగలవు?

ఉ॥ దారుణ మృత్యువాతఁబడి తల్లడమందెడు వేళలందునన్
నారకపాతముం గని మనంబున బెగ్గిలి తాపమొంది దు
ర్వారకృతాంతబాధల నవశ్యము బొందెడు వేళలందు నీ
సారప్రశస్తసతి మనఁబు నారఁడు లంతుపు దీనచిత్తవై.

హేరోదియు;—ప్రాణేశా! నిర్భయముగ నీయోహాను నభిముఖుండై నావలన దమకుఁ జేటుఁ జేకూరుననియు నెంచి నన్నికఁ [illegible]నకు నట్లు, మూ[illegible] పలి చెదు కఠినోక్తులు వినియు మిన్నకుండెదరేల?

చ. చులకనగా నితండు మిముఁ జూచి పరాక్రమశాలిగానిటన్
బలుకఁగరాని కుత్సితపు బల్కులు వల్కి పరేశుఁ బ్రేమ ని
ష్ఫలమొనరించి నారమని పాపమొనర్చుట శాపమంచుఁ దా
బలుకుచునుండగా శిరము వ్రక్కలు సేయక నిల్పన్యాయమా.

హేరోదు;—దేవీ! గంధసింధురంబు రాజమార్గంబున జను చుండ శునకములెంతగ మొఱగిననేమి? ఈదురాత్ము నిటులఁ బ్రేలనిమ్ము.

రా: బ్యాగు (చాయ బలేమంచి చౌకబేరము) తా: ఏకతి౹శ.

నిరాధారములగు పల్కులు - నేరముల్ మోపఁగా
భీతినొందు - వారలెవరు? = దురాచారమని నీతఁడు -
దూలనాడుచుండగా - చెరసాలకునంపి ముండ్ల —
కొరడాలతో గొట్టింతము ॥నిరా॥

యోహాను;—శరీరము నశింపఁదలఁపడు - దొరలకు త్రేండ్లకు
భయపడంగఁ జాలనిలలో = పరాధీనురాలి గవయఁ-
బాపంబని పల్కుచుండఁ - బశ్చాత్తాపము నొందక -
వదరుచుండన్యాయమా? ॥ శ ॥

భటుఁడు;—(ఈటెతో పొడవబోవును)

హేరోదు;—నిన్ను లెక్కసేయువారెవరు? యోహానూ! ఏల? నీకీకంఠశోష?

గీ. మమ్ముగదుమవచ్చితివ? నీ కి మాయబోధ
వలన వెఱపంద మేమిట కి నిలువ లేదు
మారువల్కిన జెఱసాల ♦ మనికిఁ జేతు
నింకఁ జాలింపుమీానుడు కి లిచటకితవ!

యోహాను—హేరోదుభూపాలా! పాపంబొడిగట్టియు నేఁబట్టిన కుందేటికి మూడేకాళ్లని వాదించెదవేల? పాపము దాపబడునా? చతురంగబల సమేతుఁడవయ్యు గాని

స్యంబున రాజకార్యంబుల నిర్వర్తింప సమర్థుండవగు నీవు మతిలేనివానివలె నిట్టి గర్భంబునొందుట కోచ నీయము.

గీ. పాపులమరల్పఁ దలపడి ౹ వచ్చినాఁడ
పాపశాపము వెలిబుచ్చ ౹ వచ్చినాఁడ
నీతినేర్పంగ జనులకు ౹ నిల్చినాఁడ
గాన జెఱశాల నిడినను ౹ గలతలేదు.

వ. మీరిరువురు దుష్టచరితులని వెలిబుచ్చితి. నిక నన్ను నీయిచ్చవచ్చినటుల నొనరింపుము.

హేరోదు—ఔనౌను. ఈడాంబికవచనముల కేమిలే ? నీకు జేటుకాలమాసన్నమైనది. ఓరీ ! భటులారా! ఈతని గొనిపోయి కారాగృహాధికారితో నాయాజ్ఞగా జెప్పి చెఱనుంపుడు. పొండు.

భృత్యులు;—చిత్తము. దేవరా (అని) ఇఁక నడువవయ్యా ; ఏల జాలమొనరించెదవు?

యోహాను—అయ్యలారా ? ఇదే వచ్చుచున్నాఁడ (పరిక్రమించి)

రా: కన్నడ. తా: రూపకము.

సర్వావస్థలందుఁ గాచు - సర్వేశ్వర ! నీవెదిక్కు-
గర్వాంధతఁ జెడిన జనులఁ - గడిగి సజ్జనులుగ
జేయుము. ॥స॥ (నిష్క్రమించును)

# తృతీయాంకము.

## (ద్వితీయరంగము.)

(యోహాను చెఱలోనుండుట)

రా; సీలు. (ఛాయ జయసావిత్రి) తా; ఏకతిశ్ర.

పరమపురవర శ్రీయోహాన్వా! రావా? - పావన
మూర్తి!!యో - మరియతనూజుఁడ!!! - పరిశుద్ధాత్మ
దేవుండ!!!! ననుబ్రోవ॥పర॥

1. దురితముల ఖండించువారిఁ - జెఱనునుంపఁ దలపడెదు-
నరులహృదయ క్షేత్రమమర - పరిశుద్ధంబొనర్ప -
మెఱిగియు నెరుగని దు - స్తరపాపములన్ని_గరుణతో
దుడుపనే? మరువక॥పర॥

వ. అక్కటా! భక్త్యాసక్తిఁగలిగిన మహానుభావుల కిక్క-
ట్టులు వాటిల్లుట సహజంబని దెలియఁగలిగితి. దేవా!
నీపేరశ్రమలనుభవించుటెంతయు శ్లాఘ్యము.

సీ. భక్తుఁడౌయోసేపు \ పాపము సేయమి
కారాగృహంబును \ గనెనుగాదె?
స్థిరనీతికైబోర \ స్తెఫనునిరాధారుఁ
బగిది రాళ్లతోజంపఁ \ బడెనుగాదె?
నిర్మలుండగు క్రీస్తు \ ధర్మము వెలిబుచ్చి
పొలికార్చు మరణంబు \ బొందెఁగాదె
దుర్జనులగదిమి \ దుర్భరవెతలచే
సజ్జను లెందరో \ చనిరిగాదె?

గీ. అంతటిఘనులు దమప్రాణ । మర్పణంబు
సేయఁగానిప్డు నేనేల । చింతనొంద
వలయు నిష్టున సహించి । వంద్యుఁడేసు
కై శ్రమలనుభవించెదఁ । గాక ధాత్రి.

వ. మానసమా ధైర్యముఁబూనుము. నీతినిమిత్తము సురు లెప్పింపవెఱపందకుము. అయ్యో! సునార్తసంచార మొనర్పజాలకుండునటుల గారాగృహప్రాప్తి దాప రించెఁగదా? యనిమాత్ర మధికంబుగ జింతిలవలసె. కానిమ్ము. దైవసేవనొనర్పఁ దరుణము భగవంతుం డొసంగకుండునా? దేవా! ఆపద్బాంధవా! జోహార్.

రా: జయనారాయణి. తా: ఆది.

మానవజన్మంబు - మహిఁబ్రబభుదయఁ గనవలె దీన జనుండయి - దేహీయని భగ - వానుని గొలువని జన్మంబేటికి? ॥మా॥

1. పరుషంపు నుడులం - బలుకఁగ జూచిన - నరులకు మోక్షము లభ్యముగాదు - కరుణాత్ముండగు - మరి యాంబసుతుఁ - బరిచయమొందకఁ - దిరుగ ఫలం బేమి? ॥మా॥

వ. ఔను. పరమాత్ముని భజింపక మదకరీంద్రమువలెజరించు దుష్టులగతి యేమానోగదా! సర్వసంఘపరిత్యాగులై కేవలము మోక్షాపేక్షాపూరితులై నిరంత భగవ ధ్యానాతత్పరులై ప్రజాక్షేమమరసి వారల సన్మా

ర్గావలంబులుగ నొసరింప దృఢమనస్కులై వర్తిలు మముబోంట్లకే యిట్టి దుర్గతిసంభవించెనే? ఇక విషయాశక్తులై దుర్జనసహవాసాదోషంబున బాపులై ధాత్రిఁ బ్రతిఫలించువారిగతి యెటులుండునోగదా? వ్యభిచరించుట దగదనిదెలుప నా హేరోదు భూపాలుండు క్రుద్ధుండై నాకిట్టిచేయుఁ గటగటా చెడ! అయిన నాపదసమయములందు భీతినొందుట బుద్ధిమంతుల లక్షణముకాదు. (పరికించి) ఓహో! అర్ధరాత్రియయ్యెను. చెరసాల కావలివారు కూడా నిద్రించిరి. ఇంచుక నేనిశ్రమింతుఁగాక. (మోకాళ్లూని) జగద్రక్షకా! ఆర్తత్రాణపరాయణా!!

గీ. వలయు సుఖసుషుప్తి బలముఁ గలుగఁజేసి
ధైర్యము వినిశ్చలమతియుఁ దాల్మియునిడి
యాశిషంబులనొసఁగిన న్నాదుకొనుచు
వేకువనె మేల్కొలుపుమంచు వేడుకొంటి.

ఇక శయనింతుగాక (నిద్రించును)

---

# తృతీయాంకము.

## (తృతీయరంగము)

(హేరోదు జన్మదినమహోత్సవముఁ బ్రచురించువెట్టి తప్పెటతో బ్రవేశించును)

వెట్టి—ఈ టమటమవల్ల నందరికి తెలియజేసే దేమంటే పెద్దోల్లు, పిల్లోల్లు, సిన్నోల్లు, ఆడోల్లు, మొగోల్లు,

అందరు వినండోహూ! గొప్పలేదనేరు. ఇక లేదనేరు. నాకొంపదీసేరు, రేపు మనయేరోదు రాజుగారి పుట్టినరోజు పండుగంటా, అందరూ సున్నాలుగొట్టుకోవాల. తోరణాలు గట్టుకోవాల. ఉత్సవాలు సేయాల, అందరికి రాజుగారి నగర్లో రేపు భోజనాలంట. ఇందులారిగించాలంటా. అందరూ తప్పక రావలసినదంటా ఆనదప్పిస్తే సంకెళ్లేస్తారంట, వినండోహూ!

—♦ దర్బారు ♦—

(హేరోదు మంత్రిసత్తములతో నాశీనుండైయుండును)

సెఫన్య—మహాప్రభూ! ఏలినవారి జన్మదినమహోత్సవము మాకెల్లరకుఁ బురవరులకుఁ గనులపండువొనర్చి. విందు నిర్విఘ్నముగా జయప్రదముగా నెరవేరె. భగవంతుండు లేమకు చిరాయు రారోగ్యైశ్వర్యంబుల నొడఁగూర్చుగావుత. సభ్యులారా! ఇమ్మహనీయుండాశీర్వదింప బహుశటుల భగవంతుఁ బ్రార్థింతము.

(అందరు నిలువఁబడి)

రా: కాఫి తా; ఆది.

చిరాయువుం బడయుచు వర్ధిలి - పరాత్పరుని దయుఁ
గనుమ = ధరనపార యశముఁగాంచి సో - దరప్రేమం
గలిగియు మనుమా - స్థిరమధురంబగు సత్వముగూర్చి
నరులరక్షణమునకై — బెరుగుముబల్ ॥చి॥

వ. సర్వేశ్వరుండు మిమ్ముదీర్ఘాయుష్మంతులురుగ నొనరించుఁగావుత.

హేరోదు—మంత్రిసామంతవరులారా! మీభక్తికిమెచ్చితి.

రా: బ్యాగ్ (చాయ॥ అక్షయాపరగిన) తా: ఆది

నరవరులార! న - బ్బురముగదినాడను = గురుసాబు
నాజన్మదినంబతినా పుగ-నాచరించితిరిదిశ్లాఘ్యము॥న॥
1. పౌరులు దనుతను - కోరిమినారించి - భూరిసఖ్యారతి
జూపిరి॥న॥

వ॥ ఇంక నాశీనులుకండు.

కంచుకి—జయమ్ జయమ్దేవరా! ఏలినవారి పుత్రికారత్నము
తమ్ము సందర్శింపనున్నవారు.

హేరోదు—సరియె. ప్రవేశపెట్టుము.

కంచుకి—చిత్తము. దేవరా! [నిష్క్రమించును.]

సలోమి—జనకా! నమస్కృతులు.

హేరోదు:—నిం కోలగంబున నుండుతరి నేగతంబున వచ్చితివి?

సలోమి;—జనకా! వినుడు.

గీ॥ పండితసభామయంబున కే నిందుదయను
నాట్యమాడెదనంచు నే కనంగలేదె?
ఇపుడు నాట్యముసల్పెద కే నింపెసంగ
గాన కలవింపు నాడెదం కే గాంతుదీర.

హేరోదు;—ఔనమ్మ. నీయిచ్ఛదీర కీరల మానసంబులలర
నాట్యమాడ ననుజ్ఞనిచ్చితి.

సలోమి;—మహాభాగ్యము.

రా: బ్యాగ్. తా: ఏకతిశ్రి:

జనకోత్తమునిజన — దినముగాంచగలిగితిని వినోద
మందఁజేయఁ - బనిబూనినాడెదను॥జన॥

1. చిరకాలమీభువిని - వరలభగవంతుండు గృపను —
దరిచ్చె వలయుసంప - దలచె వెలయ నడుపుగాక॥జన॥

హేరోదు;—కుమారీ! నీనాట్యకౌశలం బద్వితీయమైనను
నీసభ్యుల నానందవారాశి నోలలాడించె.

రా: బ్యాగు. తా: ఆది.

ఇల సభాసదులిచట - నింపొందగ నాట్యంబాడితి
వబ్బురమందఁగ — విలసిల్లెడు భూపతులకు నియ్యెడి
వేడుకగలిగించెను శ్లాఘ్యము ॥ఇ॥

1. మెచ్చితి నీడగునాట్యకౌశల్యము - నిచ్చెద నీకోరెడు
వరమిప్పుడే- సచ్చారిత్రవుగా రూపింతువు. యిచ్చాను
సారము కోరుము వరముల-నీరాజ్యంబు నసర్థంబైన
బుచ్చుకొనవగును నాయనుంగు పుత్రి ॥ఇల॥

పభ్యులు:—రాజా! నిశ్చయము. నిశ్చయము. నాట్యప్రావీ
ణ్యము గడుంగడు శోభాయుతమై యొప్పుచున్నది.

హేరోదు:—అమ్మా! వినుము.

ఉ మెచ్చితి నీదునాట్యమును నీ మేలుఘటించెద నీకునిచ్చచే
వచ్చిన భూవరేణ్యులును వర్ణనజేసిరి నీను నేర్పు నా
కిచ్చజనించె నమ్మ భవదీప్సితమొప్పెడు గోరుమింక నే

నిచ్చెద నర్థరాజ్యము గకెణింపదలంపు మపారవాంఛచే.
వ. కానసీవు గోరదలంచినది సరగజెప్పుము.

సలోమి;—జనకా! తామొనర్చిన వాగ్దత్తమున కెంతయు సంత సించితి. గాని నాజనని యభిలాష నించుక గనుంగొని పిదప గోరెద. మన్నింపుడు.

హేరోదు; అమ్మా! అట్లే గావింపుము.

(నిష్క్రమింతురు.)

శ్రీ

# భక్త యోహాను.

## చతుర్థాంకము.

(ప్రథమరంగము)

హేరోదియ ప్రవేశము.

హేరోదియ—(స్వగతము) క్షత్రియవంశోద్ధారకులమై సర్వజనాదరణా పాత్రులమై వెలయుచుండఁ గాలహంతకుండగు యోహాను మములధిక్కరించి పాపంబొడిఁగట్టితి మనియు నీచాధములరీతి వ్యభిచరింతుమనియు గద్దించుట నాకెంతయు విషాదము సంఘటించె. వానిమరణమునకు నడిపింప యత్నింతుఁగాక.

సీ॥ రాజిల్లు రాణిగా । రాజ్యమేలుచునుండ
నలజడధారిన్ । గలతబరచె
సామ్రాజ్యలక్ష్మినై । శారదినైయుండ
నలజడధారిన్ । గలతబరచె
శత్రుసేనలఁ బాద । సన్నిధినిడుచుండ
నలజడధారినై । గలతబరచె

మణిసికేతనమున ॥ మహిమనే గనుచుండ
నలజడధారిన౯ ॥ గలతబరచె
గీ॥ నాజ్ఞనిడునంతనే జను ॥ లదరుచుండ
బిచ్చిపరివ్రాజకుడు నీచ ॥ బుచ్చిపోయె
నకట! మరణదండన నెట్లు ॥ నైన మాన
కవిధియింతు నాక్రోధంబు ॥ దప్పులునటుల.

(పరికించి) నాపుత్రిక సలోమి దరహసితవదనయై! వచ్చుచున్నది. అమ్మా! రమ్మా. (ముద్దిడి) నృత్య మొనరించితివ? మీతండ్రిగారేమనిరి?

సలోమి—అమ్మా! జనకుండు గడుసంతసించి నేగోరినదెల్ల నొసంగుదుననియు దుదకు సర్థరాజ్యంబైన నొసంగెద నని పండితసభామధ్యంబున బ్రతిజ్ఞనిడెను. నాకే మియుదోపక నీవేమడుగ మనియెదవో గనుంగొన వచ్చితి.

హేరోదియ—(స్వగతము) ఆహా! దైవసంకల్ప మీరీతింగదా యుండవలయు. నింతకమున్నె నానీచునెవ్విధి సమ యింపనగునని దలఁచుచుంటిని. ఇప్పుడవకాశముజిక్కె గావున నిట్లనియెదఁగాక. (ప్రకాశముగా) కుమారీ

(చాయ: మీరజానగలడా)

కుమారీ! నామనోవాంఛ౯ దెలిపెదఁ - గోరుటమాన
కుము = అమాయకునివలెనుండిన యో - హాను
దలనుఖండింపుమంచు - నడుగఁదెగింపుమిక౯॥కు॥

ప్రమాదముఁ గలిగింపనాదుట దు - ర్భాషలబలిష్ఠున
వానిజంపఁగవలయు॥కు॥

సలోమి—అమ్మా! బాప్తిస్మమిచ్చు యోహాను శిరమా! ఆ
మహాత్ముని దలఁగోరఁబాడియగునే!

(పైపాటవలె)

జనని! తాఁగనిమనల ధూషించెనని కిను -కనువహింప
నగునే? ఘనుండాతఁడటంచు నిపుడే _ జనులుసంభా
షింప వినవే? - గనుకజంపఁదగదు॥జనని॥

హేరోదియ—కుమారీ! నీకీయధిక ప్రసంగ మేల? జననియాజ్ఞ
మీరఁబాడియే? సరగ యోహానుతలను పళ్ళెరమం
దునిచి నొసంగఁగోరుము. పొమ్మ.

సలోమి—చిత్తము. నీయభీష్టమిూడేర్ప నటులేసరిగెద.
(నిష్క్రమింతురు.)

---

# చతుర్థాంకము.

(ద్వితీయరంగము)

(హేరోదు సామంతపరివృతుండై దర్బారున నుండుట)

హేరోదు—(స్వగతము) అకటా! సలోమి యేమడుగునో
గదా! (సలోమిసమిూపించినంతనె) అమ్మా! వచ్చితివ?
కూర్చుండుము

సలోమి—(కూర్చుండును)

హేరోదు—కుమారీ! భవదీప్సితమెద్ది? అడుగుము.

లోమి—జనకా! పండితుల సమక్షమున జేసినవాగ్దత్తము నిర్వహించు సత్యసాధుండవౌదువేని నేఁగోరునదియొసంగుము. ఎడ్వియన పూతచరిత్రుడగు బాప్తిస్మమిచ్చు యోహాను శిరము నొసంగుడు.

సామంతులు—(తలలు వాల్చిరి)

హేరోదు—హాహాహా! అమ్మా! ఎంతటి ఘోరతమంబగు కోరికఁగోరితివి? అయ్యో! యోహానుశిరమా! నిష్కల్మష హృదయుండనియుఁ బవిత్రచరితుండనియు భక్తాగ్రగణ్యుండనియు జనులచే నైకకార్యంబున బొగడబడుచుండు సన్మహాత్ముని శిరమేమని ఖండింపనాజ్ఞనిడుదు?

రా: భాగేశ్వరి. తా: ఏక

అనీతిమంతు నవ్విధి - హత్య జేయనగునా కో? నేనొన
ర్చిన పాపముఁగని - నిబ్బరింపలేక దప్పని - బూనిక
బోధింపునంతనె - హాని జేయఁజెల్లిచ్చినందిటి॥నాసి॥

వ. కట్టా! జన్మదిన మహోత్సవసమయంబున సిసలోమి నేల నృత్యమాడనిచ్చితిని? ఇనిటకుబో నీమెకు నవమణి కల్పితానర్ఘ్య భూషాంబరములలో నేదేని యొసంగక నలయు కోరికం గోరుమని నేలవాక్కిచ్చితిని? వాక్కిచ్చితినిబో? యీామె వెంటనేగోరక నిట్టికఠిన కోరిక నేలకోరవలయు?

గీ॥ జనమతుండనై దలఁపక ్ బుడమిరేండ్ల
సముఖమున బ్రతిజ్ఞనోసర్చి ్ సత్యజాను

శిరము ఖండింపవలసె దుర్భరంపు పాప
మొడినిగట్టుటెట్లు? ధరిత్రి మోసపోతి

(యోచించి) ఇపుడు నేచేయునదేమి? ఇచ్చిన వాగ్దానము చెల్లింపనిచో లోకాపవాదమునకు గురియగుదును. ఇచ్చెదననిన నయ్యో? అమ్మహానీయు నే నెపమున ఖండింప నాజ్ఞనిడుదు? ఛీఛీ! ఈలాగున దలంచుచుంటి నేటికి? ఇప్పట్టున నీమెకోరిక నీడేర్చుటయే యుత్తమోత్తమము ఓరీ! సేవకా! నీవమందరయంబున నరిగి కారాగృహాధికారితో నాయానగా నుడివి యోహానునిటకు గొనిరమ్ము. పొమ్ము.

నా సూతుంబు—(విచారించుచున్నభినయించును)

సేవకుడు—చిత్తము. (నిష్క్రమించి యోహానును బంపును)

(యోహాను ప్రవేశము)

యోహాను;—

రా: ఫీలు. తా: ఆది.

పరేశా! నన్నుబ్రోవుము - విరోధభావమున- శిరంబు
ఖండింపదలంచుచున్నట్టి - నరాధిపుని సన్నిధిని ॥ ప ॥

1. పాపంబుఖండించి - ప్రాణము నర్పింపనుంటి - పాప
జనాళినెల్లఁ - బాపశుద్ధ్యంబొనరించుము ॥పరే॥

హేరోదు;—బాప్తిస్మమిచ్చు యోహానూ! నీశిరము ఖండింపబడునటుల తీర్మానింపబడెను,

సలోమి—జనకా! పండితుల సమక్షమున జేసినవాగ్దత్తము నిర్వహించు సత్యసాధుండవౌదువేని నేగోరునదియొసంగుము. ఎద్దియన పూతచరిత్రుండగు బాప్తిస్మమిచ్చు యోహాను శిరము నొసంగుడు.

సామంతులు—(తలలు వాల్చిరి)

హేరోదు—హాహాహా! అమ్మా! ఎంతటి ఘోరతమంబగు కోరికఁగోరితివి? అయ్యో! యోహానుశిరమా! నిష్కల్మష హృదయుండనియుఁ బవిత్రచరితుండనియు భక్తాగ్రగణ్యుండనియు జనులచే నైకకార్యంబున బొగడబడుచున్న సన్మహాత్ముని శిరమేమని ఖండింపనాజ్ఞనిత్తును?

రా: భాగేశ్వరి. తా: ఏక

అసితిమంతు నట్టిఘ - హత్య జేయనగునా కో? నేనొనర్చిన పాపముఁగని - నిబ్బరింపలేక దప్పని _ బూనిక బోధింపునంతనె - హానిజేయఁజెలిచ్చినందితి॥నాసి॥

వ. కట్టా! జన్మదిన మహోత్సవసమయంబున నీసలోమి నేల నృత్యమాడనిచ్చితిని? ఇనిటకుబో నీమెకు నవమణి కల్పితానర్ఘ్య భూషాంబరములలో నేదేని యొసంగక వలయు కోరికం గోరుమని నేలవాకుచ్చితిని? వాకుచ్చితినిబో? యీామె వెంటనేగోరక నిట్టికఠిన కోరిక నేలకోరవలయు?

గీ॥ జనమతుండనై దలఁపక కె బుడమిరేండ్ల
సముఖమున బ్రతిజ్ఞనోనర్చి కె సత్యజాను

శిరము ఖండింపవలసె దు ర్భరపు పాప
మొడిగట్టు నెట్లు? ధరిత్రి మోసపోతి

(యోచించి) ఇపుడు నేచేయునదేమి? ఇచ్చిన వాగ్ధానమును చెల్లింపనిచో లోకాపవాదమునకు గురియగుదును. ఇచ్చెదననిన నయ్యో! అమ్మహానీయు నే నెపమున ఖండింప నాజ్ఞనిడుదు? ఛీఛీ! ఈలాగున దలంచు చుంటి నేటికి? ఇప్పట్టున నీ కోరిక నీడేర్చుటయే యుత్తమోత్తమము ఓరీ! సేవకా! నీవమందరయంబున నరిగి కారాగృహాధికారితో నాయానగా నుడివి యోహానునిటకు గొనిరమ్ము. పొమ్ము.

నాసంతోషము—(విచారించుచున్నభిన యించుచు)

సేవకుడు—చిత్తము. (నిష్క్రమించి యోహానును బంపును)

(యోహాను ప్రవేశము)

యోహాను;—

రా: ఫీలు. తా: ఆది.

పరేశా! నన్నుబ్రోవుము - విరోధభావమున- శిరంబు ఖండింపదలంచుచున్నట్టి - నరాధిపుని సన్నిధిని ॥ ప ॥

1. పాపంబుఖండించి - ప్రాణము నర్పింపనుంటి - పాప జనాళినెల్ల - బాగశుద్ధ్యంబొనరించుము ॥ పరే॥

హేరోదు;—బాప్తిస్మమిచ్చు యోహానూ! నీశిరము ఖండింపబడునటుల తీర్మానింపబడెను,

( ఫార్సీమెట్టు )

నీశిరంబిటుల ఖండింపబడునో యోహానా - దోసమో
సత్యంబో? దల్పకుండఁగబల్ ॥నీ॥
ఆశించిన నీదేవునిలఁచి - యారాధించుకొను-మాపద
గల్గె ॥నీ॥

హేహాను;—హేరోదుభూపాలా ! సర్వావస్థలఁ బారమార్థిక చింతచే సంతసించెదనని గ్రహింపుము. నాజనని ఎలిజబెత్తు ప్రార్థనాసక్తిచే నేజన్మించినది మొదలు సదా్భవంబున నావెనుక నుద్భూతుండై లోకమాలిన్యముఁ దగుల నీక నుత్తమధర్మంబుల వెలిబుచ్చుచు ముక్తినిలయంబున సదాప్రశాంతి లభింపననువగు బోధలఁ బ్రచురించుచు మహాత్ముండేసు క్రీస్తురాయబారినై యమ్మహాత్మునకు బాప్తిస్మ మొసంగి శాంతారభూములగు యోర్దాను నదీ పదిసరంబులఁ దిరిగి పాపాత్ములఁ బవిత్రులుగ నొనర్చి గర్వాయత్తచిత్తులురై ( భటుడు యీటెతో బొడవబోవుట ) వ్యభిచార వృత్తిలో మెలంగెడు భూవరేణ్యులగు మిమ్ముగదిసి సాహసించి భగవంతుసన్నిధి వ్యభిచరించుచుఁ గన్ను మిన్ను గానక జరించుట ఘోర పాపంబని వచించి నేడు జంపబడుట సమంజసము. రాజా నేమరణింపక మున్నె సభాసధులకును నీకు నించుక బోదనొనరించెద.

హేరోదు—సరియె ? కానిమ్ము.

యోహాను—సభ్యులారా !

సీ. సంతతానంద ర | సామృతవారాశి
కల్లోల నిర్మగ్ను | ఘనుని గ్రీస్తు
దుర్భరపాప సం | దోహరక్షణదక్షు
దీప్తి భాసిత జగ | ద్ధీరు గ్రీస్తు
సకలదిగంత వి | శ్రాంతయశః చంద్రి
కా విరాజిత లోక | కాంతు గ్రీస్తు
విశ్వప్రపంచ సం | విష్ట మానవబృంద
పాపాటవీకృష్ణ | వర్త్మ గ్రీస్తు

గీ॥ అట్టి దేవకుమారు ని | నఘవిదూరు
నమ్మి కొల్చుడి శాశ్వతా | నందసుఖము
బొంద నిరతంబు సమబుద్ధిఁ | బొందుగలిగి
విశ్వక్రైస్తేతర జన ప్ర | విష్టులార.

ఫ. మరియు,

సీ॥ ఇలఁ గ్రైస్తవత్వంబు | చెలువొంది నరులకు
ప్రత్యక్షమగునట్లు | పాటువడెడు
దుర్జన దౌర్జన్య | దోహదం బడలించి
భక్తులరక్షింపఁ | బాటువడెడు
ధనగర్వమున ద్రుల్లి | ధర్మముఁ దప్పిన
పాపుల మేల్గాంచ | బాటువడెడు
సతమనాథులనొత్తి | వెతలబెట్టెడుమూర్ఖ
పాపుల దిద్దంగఁ | బాటువడెడు

గీ॥ యేసురక్షకు నైజంబు నేమనుజుఁడు
వర్ణనముసేయగలడు సువార్తసార
మేసుచంద్రుండని దెలియు డింపుమీర
ముక్తినిలయంబు వెదకుఁడీ మూర్ఖులార!

వ. జ్ఞానముపారించి సజ్జనోచితకార్యముల గావించి మీ స్వరక్షణ గొనసాగించుకొనుఁడు.

హేరోదు—యోహానూ! నీబోధ జాలింపుము. వినుము,

సీ॥ క్షత్రియులిలఁ బగ సాధించువారని
దలఁప నీకీశిక్షఁ దప్పదయ్యె?
ప్రభువులు పరిపంధి వర్గంబునెదిరింప
దగిరని గనశిక్షఁ దప్పదయ్యె?
నరవరులగడుమ న్యాయంబుగాదని
దలఁప నీకీశిక్షఁ దప్పదయ్యె
పరిపాలకులదిద్దఁ బంకింపరాదని
దలఁప నీకీశిక్షఁ దప్పదయ్యె!

గీ॥ భూపతుల పాపములనెత్తి పొడుచుటయును
ఆగ్రహించుటయు నసుజ్ఞ లందకుండు
టయు వెఱపునందక జరించు టయుఁ దగదని
దలఁప నిపుడు నీకీశిక్షఁ దప్పదయ్యె!

సామంతులారా! యోహానుకు విధింపబడిన శిక్ష న్యాయంబని వచింప సాహసింతురా?

సామంతులు—భూజానుల ధిక్కరించు వానికీ హత్యయుకము.

హేరోదు—ఓ యోహానూ! నిన్ను దలారిచే కారాగృహమున కంపి శిరము ఖండింప నాజ్ఞనిడువాడ. ఓరీ! తలారి!! వీని గొంపోయి చెరసాలలో శిరము ఖండింపుము. పొమ్ము.

తలారి—చిత్తము దేవరా! (యోహానును బంధించి) అయ్యా నడుపుడు.

యోహాను—(కండ్లెత్తి) యేసుమహాత్మా! జోహారు.

రా; కన్నడ (చాయ రామభజనసేయవే) తా: ఆది

ప్రేమాస్వరూపా! యేసువ!! - ప్రియభృత్యులబ్రోవుము ప్రేమస్వభావంబుగన- నీమమహాశుద్ధాత్మ సాయంబొసఁగుమీశ ॥ప్రే॥ (నిష్క్రమింతురు)

---

# చతుర్థాంకము.

## (తృతీయరంగము)

### కారాగృహము.

యోహాను—(మోకాళ్ళూని) తలారీ! క్రీస్తు ప్రేమ నొకింత దలంతు

రా: కళ్యాణి—తా: ఆది

జ్ఞానపూర్ణుండౌ పరి - జ్ఞాధీశుండేసుని - జ్ఞానమెన్నంగఁదరమే మానవాళికిఁ కృపా - దానముచే సంతృప్తిఁ - బూనికనిడి శ్రీవి - ధానంబుల వెలిబుచ్చినశ్రీ ॥జ్ఞా॥

1\. ఆమహానీయు - నాధారంబున సర్వంబు - నవని సం
ఘటించుచు క్షేమసౌజన్య వి - శేష లక్ష్మీధర్మం
బుల - శ్రీమహాత్ముండేసుఁ - డెంత దృశ్యంబౌను॥జ్ఞా॥

శా॥ నారక్తంబుధరన్స్రవింపఁగనియన్యాయంబుఁబోకార్చి తా
ధీరుండై మతబోధకుండు జగతిన్ తీవ్రప్రచారంబుతో
నీరీతిన్ దురితాత్మకంబులగుచున్ హేయంబులౌ కార్యముల్
ప్రారంభింపఁగ డంగువారల ఘనుల్ ప్రాపింతురంచాడెదున్

వ. పాపికాశ్రయుండవగు యేసుమహాత్మా! నామరణ
మంగీకరించి పావన మొనరింపుము. (తలారిగని)
అయ్యా! తలారీ!' నీవిధికృత మీడేర్చుకొనుము.
(శిరము వ్రాల్చును)

తలారి;—(చూపును) అమ్మా! రాపుత్రికా!! ఇయ్యది బాప్తి
స్మమిచ్చు యోహాను తల. నీకోరిక నీడేరునటుల
ఖండింపబడెను. అందుకొనుము. (ఇచ్చును)

సలోమి;—(అందుకొనును) నే దీని నాజననికి జూపెద.

(నిష్క్రమించును)

మంగళము.

బ్యాండుస్వరము.

ధరఁబాపికాశ్రయుండైన మరియసుతు యేసునకు మంగ
ళము = దురితాత్ముల పాపభారంబు నెలమి నిదా -
భరియించినట్టి - పరమాత్మునకు మంగళము.

సంపూర్ణం.

భారతీ ప్రెస్, తెనాలి. 1933

# వై. జా౯. ఎలీషా కృతగ్రంథ పరంపర.



| | | |
|---|---|---|
| 1. క్రీస్తువిజయధ్వజము | (కాలక్షేపము) | 0-6-0 |
| 2. సత్యవర్తి విజయము | (నాటకము) | 0-4-0 |
| 3. భక్తమోహాను | (నాటకము) | 0-4-0 |
| 4. శుచిమాలిక | (వాచకము) | 0-3-0 |
| 5. రక్షణశుభధ్వని | (బోధకులకరపత్రము) | 0-1-0 |

Copies can be had from

THE AUTHOR,
ONGOLE.
Guntur District.

